వసీలీ సుహొమ్లీన్‌స్కీ

# భయంలేని పేత్య



వసీలీ సుహొమ్లీన్‌స్కీ

# భయంలేని వీత్య

చిత్రాలు: వి. షుల్‌జేంకొ
అనువాదం: ఆర్వియార్







"రాదుగ" ప్రచురణాలయం · మాస్కో

# తన సొంత మాట

పంతులమ్మ కతెరీనా మొదటి తరగతి పిల్లల్ని పొలాల్లోకి తీసు కెళ్లింది. ఆకురాలు కాలపు తొలి రోజుల్లో ఒక నాటి ప్రశాంత ప్రభాత సమయం అది. దూరంగా ఆకాశంలో యెక్కడనో వలసపోయే పక్షుల గుంపు కనిపిస్తోంది. అవి కంపిత స్వరంతో కూస్తూ, పొలాలమీద విచార భరిత రావాన్ని కలిగిస్తున్నాయి. కతెరీనా పిల్లలకి యిలా చెపుతోంది:

''యివాళ మనం ఆకురాలు కాలపు ఆకాశం గురించీ, వలసపోయే పక్షుల గురించీ ఒక వ్యాసం రాయబోతున్నాం. మీలో ప్రతి ఒక్కళ్లకీ ఆకాశం యెలా కనిపిస్తోందో చెప్తారు. యిప్పుడు జాగ్రత్తగా చూడండి, పిల్లలూ. మీ భావాల్ని కచ్చితంగా, మీ సొంత మాటల్లో చెప్పండి.''

పిల్లలు గమ్మున వుండిపోయారు. ఆకాశంకేసి చూసి గట్టిగా ఆలో చించారు. ఓ క్షణం తర్వాత మొదటగా కూర్చిన పంక్తులు వెలువడ్డాయి.

''ఆకాశం ముదురు నీలంగా వుంది...''

''ఆకాశం లేత నీలంగా వుంది...''

''ఆకాశం నిర్మలంగా వుంది...''

అంతే. మళ్లీమళ్లీ పిల్లలు అవే మాటల్ని వురిస్తూ అన్నారు.

నీలి కళ్ల చిన్న వాల్యా నిశ్శబ్దంగా ఒక పక్క నుంచుని వుంది.

''నువ్వు యేం మాట్లాడ్డం లేదేం, వాల్యా?'' అంది పంతులమ్మ.

''ఆకాశం సౌమ్యంగా వుంది'' అంది వాల్యా చిరునవ్వు నవ్వుతూ.

పిల్లలు ఒక్క క్షణంలో అంతకుముందు తాము చూడని దాన్ని దర్శించారు.

''ఆకాశం విచారభరితంగా వుంది...''

''ఆకాశం కల్లోలంగా వుంది...''

''ఆకాశం విచారంగా వుంది...''

ఆకాశం ఒక సజీవ ప్రాణిలాగా క్రీడలాడింది, తళతళలాడింది, వూపిరి పీల్చింది. పిల్లలు దాని ఆకురాలు కాలపు ఆశాపూరిత నిర్మల నీలి నేత్రాల లోకి తేరిపార చూశారు.

# భయంలేని పీత్య

జూన్ నెలలో వేడిగా వున్న ఒక రోజు. అయిదవ తరగతి పిల్లలు ఆ వేళ అడవిలో గడుపుతున్నారు.

అడివి యెంతో సరదాగా వుంది. పిల్లలు ఆటలు ఆడుకున్నారు. విడిది మంటమీద పాయసం వండుకున్నారు.

సాయంత్రం వేళకి చెట్ల వెనకనుంచి వున్నట్టుండి నల్లని మేఘాలు కమ్ముకున్నాయి. ఆకాశంలో ఉరుములు గర్జించాయి. పిల్లలు నేరుగా కొంతమంది గొర్రెల కాపరుల గుడిసెలోకి తల దాచుకునేందుకు పరిగెత్తి పోయారు. చిన్న పీత్య వాళ్లతోబాటు పరిగెత్తి వెళ్లాడు. హఠాత్తుగా ఆకాశంలో మెరుపు మెరిసింది. చెవులు చిల్లులు పడే ఉరుము మోత యెత్తించింది. పీత్య వణికిపోతూ ఒక పెద్ద ఓక్ చెట్టు కింద వొదిగి పోయాడు, కళ్లు ముడుచుకున్నాడు. కళ్లల్లో నీళ్లు తిరగడానికి సిద్ధంగా వున్నాయి. అతను సాయం చెయ్యండోయ్ అని అరుద్దామని నోరు తెరిచేటప్పటికే అతని తోటివిద్యార్థిని వాల్య అతని పక్కన చేరింది.

''నువ్వా, పీత్యా?'' అని ఆమె అరిచింది. ''అమ్మయ్య, బతికాను. నేను ఒంటరిగా లేను. యిప్పుడు నాకు అంత భయం లేదు'' అంది.

పీత్య బిగపట్టి, చుట్టూతా చూశాడు. కుండపోతగా కురిసే వానలో అడవి మునిగిపోయింది. క్షణకాలం పాటు చెట్లనీ, పొదల్నీ అరుణ కాంతిలో ప్రతిఫలింపజేస్తూ మెరుపులు మెరిశాయి. అడివి వూగిపోయింది, మూలిగింది. తనూ, వాల్య యిద్దరే యీ ప్రపంచంలో వున్న మనుషులమని పీత్యకి అనిపించింది. యిప్పుడు భయపడ్డం అంటే అతనికి చచ్చేటంత సిగ్గనిపించింది. పక్కన ఆడపిల్ల వుండి, ఆమెని నువ్వు కాపాడవలసివస్తే నువ్వు యెలా భయపడగలవు? పీత్య అన్నాడు:

''భయపడకు, వాల్యా! నాకు ఉరుమన్నా, మెరుపన్నా భయం లేదు.''

అతను ఆమె రాగి రంగు జడని నిమిరాడు. యింక అతను తర్వాత భయపడనే లేదు, ఒక్క పిసరు కూడా.

# పేత్రిక్ యెందుకు యేడ్చాడు?

అమ్మ రొట్టెల దుకాణం దగ్గరకి వెడుతూ పసివాడైన పేత్రిక్‌ని యింటి దగ్గర వదిలిపెట్టింది.

ఆమె వెళ్లిపోయిం తర్వాత, పేత్రిక్ తెరిచిన కిటికీ దగ్గరికి వెళ్లాడు.

కిటికీ తీనెమీద పూలకుండీ వుంది.

పూలకుండీ అంచుమీద రంగురంగుల పెద్ద సీతాకోకచిలక వాలింది. పేత్రిక్‌కి ఆ సీతాకోకచిలకని పట్టుకుందామని యెంతగానో అనిపించింది. అతను చేతుల్ని దొప్పలా చేసి, తీనెమీదకి పాకి, అందుకుని, పూలకుండీని కిందకి తోసేశాడు. అది పడిపోయి, ముక్కలు ముక్కలైపోయింది

పాపం పేత్రిక్‌కి భయం వేసేసింది. ''యేం చెయ్యాలి? అమ్మ యేమంటుందో?''

అతను ఆ ముక్కల్ని యేరి, వాటిని తోటలోకి తీసికెళ్లి, ఒక పార తోటి గొయ్యి తవ్వి పాతిపెట్టేశాడు. అప్పుడు కిటికీ దగ్గర అమ్మ రాక కోసం చూస్తూ వుండిపోయాడు.

అమ్మ తలుపు తియ్యగానే, అతను గుమ్మం దగ్గరికి పరిగెత్తుకుని పోయి వెళ్లగక్కేశాడు:

''అమ్మా, నేను కాదు పూలకుండీని పగలగొట్టింది, ఆ ముక్కల్ని తీసికెళ్లి, పారతో గొయ్యి తవ్వి, తోటలో పాతిపెట్టింది నేను కాదు'' అన్నాడు.

అమ్మ కళ్లల్లో పేత్రిక్‌కి కోపం కనిపించింది.

''అయితే యెవరు పగలగొట్టారు పూలకుండీని?'' అమ్మ అడిగింది.

''సీతాకోకచిలక'' అని మెల్లిగా అన్నాడు పేత్రిక్. అమ్మ నవ్వింది.

''సీతాకోకచిలక పూలకుండీని పగలగొడితే పగలగొట్టిందేమోలే'' అంది అమ్మ. ''కాని ఆ ముక్కల్ని తీసికెళ్లి, పారతో గొయ్యి తవ్వి, అందులో వాటిని యెలా పాతిపెట్టగలదు?'' అంది.

పేత్రిక్ అమ్మకేసి చూసి, యేడుపు లంకించుకున్నాడు.

# యేది మంచిది?

అనగా అనగా ఒక చిన్న పిల్ల వుండేది. ఆ పిల్లకి యేదో ఒకటి అడుగుతూ వుండడమంటే యిష్టం.

''అన్నిటికంటే యేది మంచిది?'' అని వాళ్ల అమ్మని అడిగేది. ''యాపిల్ పళ్లా భేరీ పళ్లా? గులాబీ పువ్వా లేక మొగలి పువ్వా? మంచి నీళ్లా నిమ్మషర్బత్తా? బొమ్మా లేక బంతా?'' అని అడిగేది.

తన అనుమానాలు తనకి వున్నా గానీ వాళ్లమ్మ ఓపిగ్గా జవాబు చెప్పేది.

బొమ్మా లేక బంతా, గులాబీ పువ్వా లేక మొగలి పువ్వా? యేది మంచిది అంటే యేం చెప్తాం?

''అమ్మా! యేవి మంచివి, అద్భుత కథలా లేక పాటలా'' అని ఆ పిల్ల ఒక రోజున అడిగింది.

''అయితే నువ్వు చెప్పు యేది అన్నిటికంటే మంచిది? సూర్యుడా? ఆకాశమా? నువ్వు దానికి జవాబు చెప్తే నేను చెప్తా అద్భుత కథలు మంచివో, పాటలు మంచివో'' అంది అమ్మ.

ఆ చిన్న పిల్ల చాలా సేపు గట్టిగా ఆలోచించింది. వుహుఁ, లాభం లేకపోయింది. ఆ పిల ఆకాశంకేసి చూసింది, ప్రకాశమానంగా వున్న సూర్యబింబంకేసి చూసింది. అవి యెంతో అందంగా వున్నాయి, అసలు విడదియ్యలేం.

ఆ తర్వాత ఆ చిన్న పిల్ల అన్నిటికంటే యేది మంచిదీ అని అడగ లేదు. ఆ పిల్లకి మరో సందేహం వచ్చింది: అద్భుత కథల్లో యేది మంచిది? పాటల్లో యేది మంచిది?

వాటిని గురించి అమ్మ సంతోషంతో చెప్పేది.

# తోడేలు తలా లేక పుష్పమా

సెర్గేయ్‌క, మికోల అనే అబ్బాయిలు బడినుంచి యింటికి వెడుతున్నారు.

సెర్గేయ్‌క సంతోషంగా వున్నాడు. పంతులమ్మ అడిగిన మూడింటికీ అతను రైటు జవాబులు చెప్పాడు. అతనికి అన్ని మార్కులూ వచ్చాయి.

మికోల విచారంగా, యేడుపు మొహంతో వున్నాడు. పంతులమ్మ అతన్ని రెండు సార్లు ప్రశ్నలు అడిగింది. అతను బాగా చెప్పలేదు, తక్కువ మార్కులు పడ్డాయి. వాళ్లమ్మ కనిపించినప్పుడు తన మార్కుల సంగతి ఆమెకి చెప్తానని పంతులమ్మ అంది.

వసంత రుతువులో వెచ్చగా వున్న రోజు అది. యెండ కాస్తోంది. దూది పింజలాంటి మేఘం గంభీరమైన వినీలాకాశంలో తేలియాడుతోంది. ఆ మేఘాన్ని చూస్తూ సెర్గేయ్‌క యిలా అన్నాడు:

''చూడరా, మికోలా యెంత అందమైన మేఘమో! తెల్లటి గులాబీ పువ్వులా వుందది. చూడు యెలా దాని రేకలు విచ్చుకుంటున్నాయో యెంత నాజూగ్గా, ముచ్చటగా వున్నాయో. అవి యెలా పిల్లగాలిలో అల్లల్లాడుతున్నాయో.''

మికోల ఆ మేఘంకేసి దీర్ఘంగా చూసి, తన నేస్తంతోటి గొణుగుతూ చెప్పాడు:

''నాకే రేకలూ కనిపించడం లేదు. పువ్వూ కనిపించడం లేదు. ఆ మేఘం ఒక తోడేల్లా వుంది. దాని తలా పక్క భాగాలూ నీకు కనిపించడం లేదూ? ఆ తోడేలు నిన్ను మింగేద్దామా అన్నట్టు తన దుష్ట దవడల్ని తెరిచింది.''

ఆ అబ్బాయిలు మేఘంకేసి చూశారు. యెవడికి అనిపించింది వాడికి కనిపించింది.

# బుల్‌బుల్‌పిట్ట యెందుకు యేడుస్తోంది?

వూరి శివారులో వున్న ఒక గుడిసెలో ఒక భార్యా, భర్తా వుండేవారు. వాళ్లకి యిద్దరు పిల్లలు: ఒక చిన్న అబ్బాయి, పేరు మీష; ఒక చిన్న అమ్మాయి, పేరు ఓల్యా. మీషకి పదేళ్లు, ఓల్యాకి తొమ్మిదేళ్లు.

వాళ్లింటికి పక్కనే యెన్నో కొమ్మలున్న, పొడుగాటి పోప్లార్ చెట్టు పెరిగింది.

''చెట్టుమీద ఉయ్యాలా వేద్దాం'' అన్నాడు మీష ఒక రోజున.

''ఉయ్యాలా వుంటే యెంత బాగుంటుందో'' అంది ఓల్యా కేరింతాలు కొడుతూ.

అంచేత మీష పోప్లార్ చెట్టెక్కి, గట్టిగా వుండే ఒక కొమ్మకి తాడు కట్టాడు.

మీష, ఓల్యాలు యిద్దరూ ఉయ్యాలా యెక్కి, ముందుకీ వెనక్కీ వూగడం మొదలుపెట్టారు.

ఆ పిల్లలు వెనక్కీ ముందుకీ వూగుతూ వుంటే ఒక చిన్న బుల్‌బుల్ పిట్ట పాడుతూ వాళ్ల తలలమీద యెగిరింది.

''మనం ఉయ్యాలమీద వూగడం బుల్‌బుల్ పిట్టకూడా సంతోషంగా వుంది'' అన్నాడు మీష చెల్లెలితోటి.

ఓల్యా చెట్టు బోదెకేసి చూసింది. అక్కడ ఒక చిన్న కంత వుంది. అందులో ఒక చిన్న గూడు వుంది. ఆ గూట్లో కొన్ని పిట్ట పిల్లలు వున్నాయి.

''వుహుఁ, బుల్‌బుల్ ఆనందంగా లేదు, అది యేడుస్తోంది'' అంది ఆమె.

''యెందుకేడుస్తోంది అది?'' అన్నాడు మీష ఆశ్చర్యపోయి.

''యెందుకో, వూరికే వూహించు'' అంది ఓల్యా.

ఉయ్యాలమీదనుంచి కిందికి వురికి మీష బుల్‌బుల్ చిన్న గూటికేసి చూశాడు. బుల్‌బుల్ పిట్ట యెందుకు యేడుస్తోందో అప్పుడు మాత్రమే తెలిసింది.

# నిత్య పోప్లార్ చెట్టు

రోడ్డు వారే చాలా పాత పోప్లార్ చెట్టు ఒకటి వుంది. శీతకట్టులో మోడుగా వుండే దాని కొమ్మలు బెంగగా చప్పుడు చేస్తూ వుంటాయి. వసంత రుతువులో ఆకుపచ్చని ఆకులతో నిండిపోతాయి. అది పహారా కాసే వాడిలాగా నుంచున్నట్టు నాకు ఎప్పుడూ అనిపిస్తుంది. నేను మా అమ్మని అడిగాను:

''మన పోప్లార్ చెట్టు వయసు యెంత వుంటుంది? దీన్ని యెవరు పాతారు?''

''నాకు తెలియదు. నాకు జ్ఞానం వచ్చినప్పటినుంచీ అది అలాగే వుంది రోడ్డు వార'' అంది అమ్మ.

నేను మా తాతని అడిగాను:

''తాతయ్యా, మన పోప్లార్ చెట్టు వయసెంత? దాన్ని యెవళ్లు పాతారు?''

''నాకు తెలవదురా! అది ఎప్పుడూ రోడ్డు వార అలానే వుంది. అది అలా పెరిగి, అందరికీ సంతోషం కలిగిస్తూ వుంటుంది. ఎవరో పుణ్యాత్ముడు దాన్ని పాతాడు. నేను చిన్న పిల్లాడిగా వున్నప్పుడు దీని కింద ఆడుకుంటూ వుండేవాణ్ణి. మీ అమ్మ తన సావాసదారులతో కలిసి, చిన్న పిల్లగా వున్నప్పుడు మాలలు కడుతూ వుండేది. యిప్పుడు నువ్వు ఆడుకుంటున్నావ్'' అన్నాడు తాతయ్య.

# పట్టుదల వున్న చీమ

బొగ్గు నలుపు చిన్న చీమ ఒకటి గబగబా పోతోంది. యింటికి పోతోంది. అది తన పిల్లల కోసం చిన్న గసగసాల గింజని తీసుకుని పోతోంది. వున్నట్టుండి దానికి దారిలో పడిపోయి వున్న గుమ్మడి గింజ కనిపించింది. ఆ గింజ తియ్యగా, సువాసన వేస్తూ పెద్దదిగా వుంది. అంచేత ఆ చిన్న చీమ గసగసాల గింజని కింద పెట్టి, గుమ్మడి గింజని వీపుమీద యెక్కించుకుని లాగింది, కాని మొయ్యలేకపోయింది. ఆ గింజ దొర్లిపోయింది. మరొక సారి ఆ చీమ దాన్ని వీపుమీద యెక్కించుకుంది. కాని అది మళ్లీ దొర్లిపోయింది. అది ఆ గింజని చాలా సార్లు యెత్తింది, కాని అది మళ్లీమళ్లీ దొర్లిపోతూ, జారిపోతూ పడిపోయింది.

హఠాత్తుగా ఆ చీమకి ఒక గొంతుక వినిపించింది: యెవరో మెల్లిగా యికిలిస్తున్నారు.

చీమ చుట్టూ చూసింది. దానికి దారి పక్కన కూర్చున్న తూనీగ కనిపించింది.

''నువ్వా గింజని ఓ వెయ్యి సార్లు యెత్తి వుంటావు. యీ పాటికి విసుగు వచ్చి వుండాలి. నువ్వెలాగూ దాన్ని మొయ్యలేవు. యింక వదిలి పెట్టి పోకూడదూ?'' అంది తూనీగ.

''నువ్వు ఓడిపోయినప్పుడు మాత్రమే వదులుకోవాలంతే'' అంది చీమ.

అది మరోసారి ఆ గింజని యెత్త ప్రయత్నించింది. యీ సారి అది గింజని నిబ్బరంగా వీపుమీద పెట్టుకోగలిగింది, యింటికి మోసుకుపోయింది. యిక ఒక్క సారి కూడా గింజ జారిపోలేదు.

ఆ రకంగా వుంది చీమ పట్టుదల.

# అందరికంటే అందమైంది మా అమ్మే

ఓ తల్లి గుడ్లగూబకి ఓ పిల్ల వుంది. అది పెద్దది, దానికి బూడిద రంగు రెక్కలు, గుండ్రటి కళ్లు, పెద్ద నోరు వున్నాయి.

గుడ్లగూబలు రాత్రిళ్లు మాత్రమే యెగురుతాయి. వాటికి ప్రకాశమానంగా వున్న యెండ అంటే అదురు. అందుకని తల్లి గుడ్లగూబ తన బిడ్డకి చెప్పింది:

''పగటి పూట తొర్రలోనుంచి బయటికి యెగరకు. సూర్యుడు నీ కళ్లు పోగొట్టేస్తాడు, నీకు యింటికి దారి తెలీదు.''

కాని చెప్పిన మాట వినని ఆ బిడ్డ గూట్లోంచి బయటికి పాకి, కళ్లు ముడిచి, పచ్చిక మైదానంమీదుగా యెగిరింది. అక్కడ కళ్లు తెరిచింది. సూర్యుడికేసి చూసింది. అంతే, గుడ్డిది అయిపోయింది. గడ్డిమీద కూచుని అది మెల్లిగా యేడ్చింది. ఒక హెరాన్ పిట్ట అలా అలా యెగురుకుంటూ వచ్చింది.

''యెవరు నువ్వు?'' అని అది అడిగింది.

''నేను చిన్న గుడ్లగూబని. మా అమ్మ గుడ్లగూబ. నాకు యేమీ కనిపించడం లేదు. నన్ను మా అమ్మ దగ్గరికి యింటికి తీసుకెళ్లరూ?'' అంది.

''మీ అమ్మ యెలా వుంటుంది?'' అని హెరాన్ అడిగింది.

''యీ ప్రపంచంలో కల్లా అందమైంది మా అమ్మే. ఆమె కళ్లు దయగా, జాలిగా, మృదువుగా వుంటాయి. అలాంటి కళ్లు యెవరికీ లేవు, మా అమ్మకి తప్ప'' అంది.

# నిప్పూ పిచిక పిల్ల

ఎట్టకేలకి ముసలి తల్లి పిచిక తన చిన్న పిచికకి గూట్లోంచి యెగర డానికి అనుమతి యిచ్చింది. చుట్టూతా కిచకిచలాడి యెగురుతూ ఆ చిన్న పిచిక ''యిదేమిటి? అదేమిటి?'' అని తల్లిని అడుగుతూనే వుంది.

తల్లి ఆ పిల్లకి నేలని గురించీ, గడ్డిని గురించీ, చెట్లని గురించీ, కోళ్లని గురించీ, బాతుల్ని గురించీ, చెరువుని గురించీ మొత్తం వర్ణించింది. కాని వున్నట్టుండి, ఆ చిన్న పిచికకి ఒక బ్రహ్మాండమైన అగ్నిగోళం ఆకాశంలో కనిపించింది.

''అది యేమిటై వుంటుంది?'' అని అడిగింది.

''సూర్యుడు'' అని తల్లి పిచిక చెప్పింది.

''సూర్యుడంటే యేమిటి?'' అని పిల్ల పిచిక మళ్లీ అడిగింది.

''యెందుకు నీకా సంగతి?'' అంది చీదరించుకుంటూ తెలివైన ముసలి పక్షి. ''అది నిప్పు'' అంది.

''నిప్పు అంటే యేమిటో తెలుసుకోవాలని వుంది'' అంది పిల్ల పిచిక, ఆకాశంలో వున్న సూర్యుడికేసి యింకా యింకా యెత్తుకి యెగురుతూ.

అది తన చిన్ని రెక్కలు కాలేదాకా అలా అలా యెగురుతూనే వుంది. దానికి భయం పుట్టి, గబగబా వెనక్కి యెగురుకుంటూ వచ్చేసింది. వాళ్లమ్మకి యెంత భయం వేసేసిందో పాపం, ఒక్క మాట కూడా మాట్లాడలేదు.

''అమ్మయ్య, నిప్పంటే యేమిటో మొత్తానికి నాకు తెలిసింది'' అంది చిన్న పిచిక.

# సోమరిపోతూ - సూర్యుడూ

వేసవిలో వేడిగా వున్న ఓ రోజు ఉదయం ఒక సోమరిపోతు అడివిలో షికారువెళ్లాడు. నీడగా వున్న బయలుమీద కూలబడి మెత్తటి గడ్డిమీద నిద్రపోయాడు.

అతగాడు నిద్రపోతూ వుండగానే సూర్యుడు దీర్ఘ ప్రయాణం చేసి ఆకాశం వంపు యెక్కి వడినెత్తిన చేరాడు. మరోసారి అక్కడ తన కిరణాలని చాచి బయలుమీద యెండ పరిచాడు. సోమరిపోతుకి తలా, కాలివేళ్లూ చురుక్కుమన్నాయి. లేచి, నీడగా వున్న చోటికి పోయి, చల్లగా వున్న గడ్డిమీద పడుకోవచ్చును గాని లేవిపోని శ్రమ అది.

అందుకని అతను సూర్యుడితో అన్నాడు:

''ప్రియమైన సూర్యుడుగారూ, పక్కకి వెళ్లండి, నాకు వేడిగా వుంది.''

సూర్యుడు పకపకా నవ్వితే, బయలు అంతా మార్మోగింది.

''సోమరిపోతు కోరికమేరకి సూర్యుడు పక్కకి వెళ్లడం అనేది యేం పిచ్చి వూహ'' అని అన్నాడు.

దాంతోటి సోమరిపోతుకి కోపం వచ్చింది.

''అయితే పక్కకి వెళ్లరన్న మాట!'' అని అరిచాడు.

''వుహుఁ, నాకా వుద్దేశం లేదు'' అన్నాడు సూర్యుడు.

''సరే అయితే, మీకు బుద్ధి చెప్పడానికి నేను యిక్కడే పడుకుంటా'' అన్నాడు సోమరిపోతు.

# పాడే యీక

స్నైవ్ పక్షి యెంత చిత్రంగా వుంటుంది. అది పాడుతుంది.... అది దేంతో పాడుతుందో తెలుసా? రెక్కతోటి. దానికి రెక్కలో ప్రత్యేక మైన పాడే యీక వుంది. పిట్ట యెగురుతూ వుండగా, దానికి పాడాలని అనిపిస్తే, పాడే యీక కంపించి పాట పాడేటట్టుగా తన రెక్కల్ని యేర్పాటు చేస్తుంది. అది ఖంగుమని, సాటిలేని వూళని వూదుతుంది. కమాను కదిలేటప్పుడు ఫిడేలు తీగ మోగినట్టు, లేకపోతే సన్నని రెల్లుకాండం పిల్లగాలిలో 'జుం'మ్మన్నట్టు వుంటుంది అది.

యేమైనా ఒక రోజున దురదృష్టం సంభవించింది. స్నైవ్ పక్షి పాడే యీకని పోగొట్టుకుంది. అది జారిపోయి నేలమీద పడిపోయింది. ఆ పిట్టకి పాడాలని అనిపించినప్పుడు దానికి ఆ యీక లేకపోయింది.

ఆ పిట్ట పాడే యీక ఒక అబ్బాయికి దొరికింది. వాడి పేరు సెర్యోష. వాడు దాన్ని యేరుకుని, పరిగెత్తిపోయాడు. ఆ యీక పాడుతూనే వుంది. కాని తన యీక పాట పాడుతూ వుండడం విన్న ఆ పిట్ట చిన్న పిల్లాడి దగ్గరికి యెగురుకుంటూ వెళ్లి దాన్ని తిరిగి యిచ్చెయ్యమని అడిగింది.

"నా పాట లేకుండా నేను బతకలేను" అంది అది.

సెర్యోషకి జాలి కలిగింది. సెర్యోష ఆ పాడే యీకని దానికి తిరిగి యిచ్చేశాడు.

చిన్న బాలుడుగా వున్న సెర్యోష పెద్ద వాడయి, చాలా యేళ్లు బతికాడు. ఆ పిట్టని గుర్తుచేసుకున్నప్పుడల్లా అతనికి అనిపించింది, ప్రతి మనిషికీ తన పాడే యీక వుంటుందని. దాన్ని పోగొట్టుకోవడం యెంత విచారకరం.

